శ్రీరామజయం.

# శ్రీ వ న మా లి శ త క ము.



శ్రీగణపతిసురగురువుల .
నేఁగొలచియువాణి బాగడినేర్చినఁగొలచిన్ ।
నీగుణకథ కందంబుల
బాగుగ వినుతింతునీకు ప్రభువనమాలీ॥ 1

ఛందస్సును నేవెరుగను
అందముగను నీదుకృపను నందరువినగన్
పొందికగల పద్యంబుల
సుందరముగ జెప్పగలను శుభవనమాలీ ॥ 2

తప్పులు క్షమియించియుమరి
మెప్పులుగల నీదుకరుణ మెరయగనాపై
వెప్పరములు రానివ్వక
తప్పకనను బ్రోవుశౌరి ధరవనమాలీ ॥ 3

శ్రీమదనకోటి సుందర
కామితమందార శ్రీశ కారుణ్యనిధీ
సోమదివాకరలోచన
నామొరవిని బ్రోవుశౌరి ననువనమాలీ ॥ 4

# వ న మా లి శ త క ము.

కం॥ వనజాలయ వరకేశవ
వనజోదర వాసుదేవ వనరుహనయనా
మునిపాలన విబుధార్చిత
జనసుత నన్బ్రోవుశౌరి జయవనమాలీ ॥ 5

కం॥ వటపత్రశాయివనుచును
పటుతరముగనమ్మినాడ పరమాత్మనినున్
నెటులైన కోర్కెలొసగుచు
యిటురాగదెబ్రోవశ్రీశ యిలవనమాలీ ॥ 6

కం॥ నీభక్తుల యానందము
నీభక్తిరసంబుగ్రోల నిత్యోత్సవమా
యోభక్తకల్పపాదప
నీభక్తియె నొసగుసుగుణ నిధివనమాలీ ॥ 7

కం॥ పరభామల కాశింపక
పరధనముల గోరకెపుడు పరులకుహితులై
గురువరుల కెల్లగురువని
నిరతము భజియింపదలతు నినువనమాలీ ॥ 8

కం॥ వరశంఖుచక్రశార్ఙ్గము
కరముననందకము గదయు కౌస్తుభమణినీ ।
యురమున సిరియును మెరయగ
గురుతరముగ నిలచిబ్రోవు గురువనమాలీ ॥ 9

కం॥ సిరివర కరుణాంబోనిధి
సురసేవిత పాదయుగళ సుగుణస్తోమా
పరమేశ్వర కనకాంబర
ధరశోభిత బ్రోవుశౌరి దయావనమాలీ॥ 10

కం॥ సొగసైన నీమోమిక
నగధరపరమాత్మజూపు నామనమునబల్
దిగులొందినాడ భక్తుడ
ఖగవాహన బ్రోవుమయ్య కడువనమాలీ॥ 11

కం॥ గజరాజ వరదమునిజన
సుజనావన గరుడగమన సుందరవదనా
భుజగేంద్ర శయన శ్రీధర
అజవందిత బ్రోవరావె హరివనమాలీ॥ 12

కం॥ నినునమ్మితి నామనమున
సనకసనుతసార్వభౌమ సద్గుణాభరణా
గనుమూసిన గనుపెరచిన
గనిపించుచు బ్రోవనీవె గతివనమాలీ॥ 13

కం॥ అరిషడ్వర్గములంటక
సరగునభవ దివ్యదాన సంఘములోని
యిరువందగ ననుజేర్చుచు
స్థిరమొందగ బ్రోవుశౌరి శ్రీవనమాలీ॥ 14

# వనమాలి శతకము.

కం॥ శ్రీదేవదేవమాధవ
రాదేమిరనీకుకరుణరక్షకనాపై
యేదోషముమది నెంచక
పాదోనిధి శయనబ్రోవు ప్రభువనమాలీ ॥ 15

కం॥ మోదముగను నీనామము
సాధులచేవినుచు పొగడెసద్భక్తులకున్
లేదనుచు యమునిబాధలు
నాదిగ వేదములుబల్కె హరివనమాలీ ॥ 16

కం॥ శరణాగతవత్సలుడని
శరణంటిని వాసుదేవ శాశ్వతకీర్తిన్
వరదుడవై యెల్లప్పుడు
గరుడధ్వజ బ్రోవనీవె గతివనమాలీ ॥ 17

కం॥ నేదోసిలొగ్గివేడిన
రాదేమిరనీకుకరుణ రక్షకనాపై
వాదేలరవనజోదర
శ్రీదివ్యరమేశబ్రోవు శ్రీవనమాలీ ॥ 18

కం॥ మృదువైన తుళసిదళముల
పదిలముగను జేర్చినీదు పదములనమరన్
ముదమున నేనర్చించెడి
మదినొసగియు బ్రోవుశౌరి మహివనమాలీ ॥ 19

కం॥ ననుగన్న తండ్రివనుచును
నినువేడెద నిర్మలాత్మ నీరజనయనా
మునినందిత దయజూపుచు
ననుప్రోదగఁ బ్రోవునన్ను హరివనమాలీ ॥ 20

కం॥ శ్రీతులసీ దళహారము
నాతతముగ దాల్చినీవు నమ్మికతోడన్
ఖ్యాతిగ గరుడునిమూపున
ప్రీతిగఁ జనుదెంచిప్రోవు ప్రియవనమాలీ ॥ 21

కం॥ నన్నుఁబ్రోవను రాకున్నను
నినువిడువను నీలవర్ణ నిర్దయుడనుచున్
ఘనరగనీ మృదుపదములు
మనమునబంధించదలతు మహివనమాలీ ॥ 22

కం॥ నన్నుఁబ్రోవక నినువిడువను
దినదినమును జీరివిసికి దీనుడనై తిన్
మునిహృదయ సదననాపై
మనమున దయయునిచ్చిప్రోవు మహివనమాలి ॥ 23

కం॥ అపరాధ సహస్రంబులు
విపరీతములైనదనుచు విడువకనాపై
నెపమెంచక సర్వేశ్వర
కృపజూపుచు ప్రోవశౌరి గురువనమాలి ॥ 24

కం॥ ననుబ్రోవను రారమ్మిక
నిను వేడెద నిర్మలాత్మ నిఖిలాధారా
వనజార్చిత పదయుగళా
జననుత మునినమ్మినారి జయవనమాలీ ॥ 25

కం॥ నరహరి కృష్ణాయనుచును
మురహరి పరమాత్మయనెడి మోదపు నుడుపుల్
వరదాచ్యుత నాజిహ్వకు
పరమేశ్వరయొసగుమయ్య ప్రభువనమాలీ ॥ 26

కం॥ పురుషోత్తమ దామోదర
నరకాంతక వాసుదేవ నారదవంద్యా
సిరినాయక మునిపాలక
ధరపూజిత బ్రోవుశౌరి దయవనమాలీ 27

కం॥ జగదాధారుడవనుచును
నగధరపరమాత్మయనుచు నారాయణునిన్
ఖగవాహన నుతిజేసెద
సుగుణార్చిత బ్రోవులక్ష్మిసుఖ ॥ వన ॥ 28

కం॥ ఖగవాహన మునిజీవన
సుగుణావన దీనగమన సురచిరవదనా
నగుమోమున ననుబ్రోవను
జగదీశ్వర వరదరార జయవనమాలీ ॥ 29

కం॥ స్థిరమైన నీదునామము
శరణాగత రక్షబిరుదు శాశ్వతకీర్తిన్
మఱియెందు దాచగలవిక
మరచితివో నన్నుబ్రోవ మహిఁవనమాలీ ॥ 30

కం॥ మునుద్రౌపతి సభనేలిన
ఘనుడనుచును దలచి దలచి గావుమటంచున్
వినయముగను మొఱలిడెదను
ననువ్రుగ దయజూడవయ్య హరివనమాలీ ॥ 31

కం॥ బృందారక వందితపద
నందార్భక నాదరించి నన్నుబ్రోచుటకున్
సందేహపడకుభక్తుల
మందారంబైతివౌర మహిఁవనమాలీ ॥ 32

కం॥ కలకాలము నినువేడెద
కలుషములను బారదోలి కడుమోదమునన్
బలభద్రానుజబ్రోవుము
నలుమొగముల వేల్పుజనక ననువనమాలీ ॥ 33

కం॥ హరిమయము సర్వమనుచును
సరగున మదినెరగిమఱియు సద్గురుకరుణన్
స్థిరభక్తియుక్తులెఱిగియు
నిరతముభజియింపనోసగునిను వనమాలీ ॥ 34

కం॥ ఉపవాసంబులు వ్రతములు
తపములుమఱిజేయనలెనదరగనిభక్తిన్
స్వపమెఱిగియు నీనామము
జపియించిన దొరుకుముక్తి జయవనమాలీ ॥ 35

కం॥ ధరబొమ్మలాట చందము
గురుతెఱిగినసూత్రములను గుంపుగఁగొనుచున్
ధరమరగిన కాయంబుల
బరువడి నాశించువారి భళివనమాలీ ॥ 36

కం॥ యిరువదినాల్గును గలసిన
యిరువదియైదైన తత్వమొసగినమూర్తి
గురుతెఱిగియు గురుముఖమున
నిరతము భజియింపవలతు నినువనమాలీ ॥ 37

కం॥ శ్రీపన్నగశయనుడవని యాపన్నుల
బ్రోతువనుచు నచ్యుతనీదా
దాపెన్నడుకలుగునోయని
నాపెన్నిధినిన్నుదలతు ననువనమాలీ ॥ 38

కం॥ త్రిభువనముల పాలించెడి ప్రభువనుచును
నిన్నుదలతు ప్రత్యక్షమునన్
శుభమైన నీనుశాశ్వత
నభయంబిక నొసగిబ్రోవు హరివనమాలీ ॥ 39

కం॥ శ్రీమదన జనకయదువర
సామజనుత నిన్ను దలతు సమయంబనుచున్
కామితములు నొనగూర్చియు
భూమిజపతి బ్రోవుసుగుణ భువివనమాలీ ॥ 40

కం॥ భగవంతుడు నీవేయని
నగచరనుతశ్రుతులుబలుక నమ్మికనేనున్
బొగడితినిను బహువిధముల
జగదాత్మక బ్రోవుజేరి జయవనమాలీ ॥ 41

కం॥ శ్రీరమణీ హృదయేశ్వరి
సారసదళనేత్ర విమల సన్నుతగాత్రా
వారిజభవ రుద్రార్చిత
భూరిసుఖానంద బ్రోవు భువివనమాలీ ॥ 42

కం॥ శ్రీభూనిళ యిరుగడలను
నాభీకమలమున నలువనయముగనుంచెన్
యోభోగి రాజశయనుడ
నాభాగ్యపు రాశి బ్రోవు ఘనవనమాలీ ॥ 43

కం॥ సిరియురమున ధరియించిన
మురహర పరమాత్మయనుచు ముదముచెలిర్పన్
నిరతమునిను భజియించెద
వరదుడవై బ్రోవుధాత్రి వరవనమాలీ ॥ 44

కం॥ శ్రీకేశవ నారాయణ
లోకాధిపవాసుదేవ లోకశరణ్యా
పాకారివినుతమాధవ
రాకాశశి వదన బ్రోవు రమవనమాలీ ॥ 45

కం॥ శ్రీకపట నాటకుండవు
నీకపటము నెరుగలేక నీరజగర్భుల్
ప్రాకటముగ వెతజెందిరి
నేకుటిలుడ చెలియావశమె నినువనమాలీ ॥ 46

కం॥ కరుణారస పరిపూరిత
వరదాచ్యుత వాసుదేవ వైకుంఠపతీ
సిరినాయక మునిపాలక
సురవందిత బ్రోవుశౌరి శుభవనమాలీ । 47

కం॥ శుకనారద మునిసేవిత
సకలాత్మక వాసుదేవ సమయంబనుచున్
వికసితముఖ నినుబొగడితి
ప్రకటితముగ బ్రోవుశౌరి ప్రభువనమాలీ ॥ 48

కం॥ నీమహిమ దెలియనేరను
సామజవర సన్నుతాంఘ్రి సమయంబిదియే
నామొరవిని శీఘ్రంబుగ
కామితఫల మొసగనీవె గతివనమాలీ ॥ 49

కం॥ శ్రీలినా జన్మములెన్ని యో
మలిజన్మములెన్నొ యికను మంగళమనుచున్
మొలుకువగ నిను జేరెడి
ఫలితంబిక నొసగి బ్రోవు ప్రభువనమాలీ ॥ 50

కం॥ శ్రీతారక రామాయని
సీతాధిపనిన్నుదలతు శ్రేయములొసగన్
వాతాత్మజ నుతరాగదె
యోతాపహృదయలోల యోవనమాలీ ॥ 51

కం॥ శ్రీమానినీమనోహర
రామాయనినిన్నుదలతు రమణీయముగాన్
నామీద నెనరు చేతను
దామోదర బ్రోవుమయ్య ధరవనమాలీ ॥ 52

కం॥ శ్రీగురు తారకమంత్రము
భాగవతపురాణసేవ భాగ్యములనరన్
యోగిజనాశ్రిత నొసగుచు
సాగరనుత బ్రోవువిజయ సఖవనమాలీ ॥ 53

కం॥ ఆపద్బాంధవ రఘువర
యాపదలను బారద్రోలి యలసటదీరన్
నీపగిదిని రక్షించెడి
భూపతులిక గాననెవరు భువివనమాలీ ॥ 54

కం॥ దశరథ రాముడవనియును
విశదంబుగనిన్నుదలతు వినుమూరముగా
దశదిశల యశమునిండిన
పశుపతినుత బ్రోవుమయ్య ప్రభువనమాలీ ॥ 55

కం॥ తరణికులేశ్వర సరిగున
నరవర శ్రీరామచంద్ర నగచరవినుతా
భరతాగ్రజ ననుమరువక
ధరణిజపతి బ్రోవుసుగుణధామ వనమాలీ ॥ 56

కం॥ దశరథ కులవర్ధనుడని
కుశలవులకు దండ్రివనుచు కువలయసుతకున్
వశమొందిన నాథుడవని
విశదంబుగదలతునిన్ను వినుము వనమాలీ ॥ 57

కం॥ ఏపాల నీళ్లనుంచెదో
నీపాలను బడితినేను నిగమశరీరా
గోపాలక దయజూచియు కాపాడుము
నన్నుచాప కర వనమాలీ ॥ 58

కం॥ శ్రీరామ రామరాఘవ
నారాయణ వాసుదేవ నందకుమారా
క్షీరాబ్ధి శయన కేశవ
వారధ మదహరణబ్రోవు వర వనమాలీ ॥ 59

కం॥ సని యోగి బృందవందిత
సురచందన గరుడగమన సుందరవదనా
అరవిందనయన దశరథ
చిరపుణ్య సుపుత్ర బ్రోవు శ్రీవనమాలీ ॥ 60

కం॥ శ్రీరఘువర నీదాసుడ
నేరములను దలచకెప్పుడు నెనరుననన్నున్
గారవమున దయజూచియు
గూరిమిచే బ్రోవు శౌరి గుణవనమాలీ ॥ 61

కం॥ ఏపాపము నాకంటక
కాపాడుము నన్ను రామ కరుణామోదమునన్
నీపాదాశ్రితుడనుచును
శ్రీపాల కృపావిశాల శ్రీవనమాలీ ॥ 62

కం॥ వరదుడవై భరతాగ్రజ
దురితములను బారద్రోలు ధూర్జటివినుతా
నిరతము నీపదభక్తిని
స్థిరమతి నాకొసగి బ్రోవు శ్రీవనమాలీ ॥ 63

కం॥ అనుమానముడగి బ్రోవుము
నను క్షేముని రామచంద్ర నయగుణసాంద్రా
విను యోగి బృందవందిత
మనుజేంద్ర కృపాకరేంద్ర మహివనమాలీ ॥ 64

కం॥ మునుదీనుల బ్రోచితివని
ననువుగ శ్రుతులంచువింను సదినిజమైతే
మునినుత ననుదయజూచుచు
జనకజపతె బ్రోవుమిప్పుడు జయవనమాలీ ॥ 65

కం॥ ఇదియేమి నెనరుజూడవు
సదమలమతి రామచంద్ర సమయంబనుచున్
పదిలంబుగ నిను వేడితి
పదిగరుగదె నేమిసేతు మహావనమాలీ ॥ 66

కం॥ వరదాశరథే యనుచును
కరుణాలయ నిన్నుదలతు కంజదళాక్షా
గిరిజాపతి సంసేవిత
సిరిదాయక బ్రోవుశౌరి శ్రీవనమాలీ ॥ 67

కం॥ శ్రీజయ జానకీరామా
పూజిత సాకేతరామా భువినుతరామ
రాజతరవికులరామా
యోజనపతి బ్రోవురామ యోవనమాలీ ॥ 68

కం॥ మునిజనపాలనరామా
జనకజవరస్వామిరామజయరఘురామా
వనజభవార్చితరామా
మనుజేశ్వరబ్రోవురామ మహీవనమాలీ ॥ 69

క౦॥ వారధి బంధనరామా
నీరజదళనేత్రరామ నిర్గుణరామా
సూరిజనార్చితరామా
నారదనుత బ్రోవురామ నను వనమాలీ ॥ 70

క౦॥ శ్రీరఘునందనరామా
వారిజభవ వినుతరామ వైభవరామా
భూరిదయామృతరామా
ధారుణివర బ్రోవురామ దయవనమాలీ ॥ 71

క౦॥ ధరణిజ పరిణయరామా
సురగణ మునిపాలరామ సుందరరామా
కరుణని వేసితరామా
తరుణముయిదె బ్రోవురామ దయవనమాలీ ॥ 72

క౦॥ గౌతముభార్య యహల్యను
రాతినిమరి నీదు పాద రజమును సోకన్
నూతనముగ స్త్రీ జేసిన
ధాతవుగద రామచంద్ర దయ వనమాలీ ॥ 73

క౦॥ మునివెంబడి జని మిథులకు
తునకలుగా శివునివిల్లు దునుమాడిమరిన్
ఘనగుణనిధి సీతనుగొని
యొనరగ పెండ్లాడితౌర యోవనమాలీ ॥ 74

కం॥ ననుగావు గావుమనుచును
ననువున సరియైనగాక మఱచెంచినిన్నున్
వినయంబున శరణొందిన
మునుకొనిబ్రోచితివినీవు ముకుందనమాలీ ॥ 75

కం॥ మంగళవతి శబరొసగిన
యెంగిలిఫలమారగించి యెనయగనప్పుడున్
పొంగుచుఁ గైవల్యంబును
రంగుగ దయనొసగినావు రమవనమాలీ ॥ 76

కం॥ మునుయుడుత నీకు జేసిన
ననువగు యుపకారమునకు నానందమునన్
అనువొందగగొనివీపున
దనరగ నభయాస్తమిడవె దయ వనమాలీ ॥ 77

కం॥ మునువైరి సోదరుండిల
ననువుగశరణంబువేడ నభయంబనుచున్
గొనుమిదె లంకారాజ్యము
ననుచును బతిసేయలేదె హరి వనమాలీ ॥ 78

కం॥ నినువేడగ నావంతగు
ననుబ్రోవగ నీదువంతు నయగుణసాంద్రా
నిను దివిభువి వినుతింపగ
యినకులపతి బ్రోవసమయమిదె వనమాలీ ॥ 79

కం॥ కరిదీనత మొరలిడగను
సరగునజని మకరిదునిమి సంతోషమునన్
వరదుడవై కరిబ్రోచిన
కరుణాలయ దిక్కునీవుగదె వనమాలీ ॥ 80

కం॥ మునికాంత లన్న మొసగిన
వనజోదరనారగించి బహుశాంతముతో
మనమలరగ వర మొసగిన
ఘనగుణనిధి బ్రోవునన్ను కమవనమాలీ ॥ 81

కం॥ బాలుడగు ధ్రువునిగనిమరి
మేలగుదర్శనమునొసగి మిక్కిలిప్రీతిన్
పాలనగల వర మొసగిన
శ్రీలలితశుభాంగశ్రీశ శ్రీవనమాలీ ॥ 82

కం॥ దేవావిదురుని గృహమున
పావనమగుపిండివంటపరమాన్నములన్
నీవతిరుచి భుజియించవె
శ్రీవరద కృపానివేశ శ్రీవనమాలీ ॥ 83

కం॥ శ్రీమోహిని రూపంబున
యామోదముగలుగజేసి యసురుల నెల్లన్
యేమార్చియు నమృతముగొని
దామోదర సురులకీవె దయవనమాలీ ॥ 84

కం॥ బాలురనావుల నలునయు
వాలాయముతోడదాప వనరుహనయనా
పాలబడినన్నిరూపుల
పాలనమొనరించితౌర ప్రభువనమాలీ ॥ 85

కం॥ సుందరమగు నీమోమున
పొందికగాజగములెల్ల బొలుపుగనీవుఁ
నందుని వెలదికిఁజూపిన
చందము నిటుజూపుసత్య సఖవనమాలీ ॥ 86

కం॥ అలనాడు కుచేలునిగని
చెలువలరగనటుకులప్పుడు జయమనిగొనుచుఁ
బలుకుచియని భుజియించుచు
జెలగుచు నైశ్వర్యమీవె శ్రీవనమాలీ ॥ 87

కం॥ ఘనపాపియ జామీళుడు
మనమున తనయాత్మసుతుని మరువక నెపుడుఁ
గనుగొనినారాయణయన
మనవాడనిబ్రోవలేదె మహీవనమాలీ ॥ 88

కం॥ నరనారాయణు లనుచును
ధరవెలసియుదుష్టజనుల దండించిదయఁ
వరదుడవె శిష్టప్రతి
పరిపాలనజేసితౌర ప్రభువనమాలీ ॥ 99

కం॥ నీపాద తీర్థసేవయు
నీ పాదార్చకులపొందు నిత్యసుఖంబుల్
గోపాలకనివి యొసగుచు
గాపాడుము శంఖచక్ర కర వనమాలీ ॥ 90

కం॥ వనధిలో మగమీనము వై
దనుజుని సోమకునిద్రుంచి తడయకజన్మముల్
గొనుచునుమరినిగమంబులు
తనయుండగుయజునికిడిన దయవనమాలీ ॥ 91

కం॥ అందముగ సురలుదనుజులు
యందరు క్షీరాబ్ధిదరువనానందమునన్
సుందర కూర్మపురూపున
మందరగిరి యెత్తితౌర మహివనమాలీ ॥ 92

కం॥ కిటియవతారమునుదాల్చియు
కుటిలుని హేమాక్షుదునిమి కుంభినిమరలన్
పటుతరముగ నెప్పటివలె
ఘటికుడవై నిల్పినావు గద వనమాలీ ॥ 93

కం॥ నరహరి వర స్తంభంబున
గరుడధ్వజ నుద్భవించి గనుగోపమునన్
యిరువడినసురునిద్రుంచియు
మరిడింభకుబ్రోచితౌర మహివనమాలీ ॥ 94

కం॥ వటుఁడవై మూఁడడుఁగులు
దడయక బలివేడినుర్వి దానముగొనుచున్
గడువెలసియు విశ్వాకృతిబడసియు
దివిసురులకీవె భళివనమాలి ॥ 95

కం॥ హరిపరశురాముఁడై భువి
మనువకమును యెఱుఁగనదొక్కట మూఁకలఁగడిమిన్
నరపతులను నురుమాడియు
ధరకశ్యపు నొసఁగితౌరదయ వనమాలీ 96

కం॥ దశరథ శ్రీరాముఁడవై
దశకంఠుని కుంభకర్ణ దనుజులనెల్లన్
కసిదీరగ బరిమార్చియు
కుశలంబుగ సీతగొనవె గుఱు వనమాలీ ॥ 97

కం॥ సరసిజవర యదుకులమున
సరగునబలరామకృష్ణ సంభవులగుచున్
వరపాండు సుతులఁబ్రోచుచు
ధరభారమడంచితౌర దయ వనమాలీ ॥ 98

కం॥ అసురాంగన లాదఱుశుచి
వసనములనుచాలగట్టి వలదనివ్రతముల్
వసుమతిసల్పగ జనిమరి
మసలక చెఱచితివి బౌద్ధమవె వనమాలీ ॥ 99

కం॥ కలికావతారమునయా
బలుదుష్కృతములనుధరలో బాపుటకొరకై
విలసితమతిజన్మించియు
బలుశుభములనొసగిబ్రోవు ప్రభువనమాలీ ॥ 100

కం॥ దశవిధముల నినువేడితి
దశరథసుత రామచంద్ర ధరణీశకృపన్
యసమొసగియు యెల్లప్పుడు
పసివాడని బ్రోవుశౌరి ప్రభువనమాలీ ॥ 101

కం॥ ఇరువుగనాలత్తూరిలో
వరదుడవై భక్తజనుల వరమొసగుచున్
గురుతరముగ దర్శనమును
జిరకాల మొసంగిబ్రోవు శ్రీవనమాలీ ॥ 102

కం॥ వందనములు సర్వేశ్వర
వందనములు సర్వలోక వర్ణితచరణా
వందనములు నీకెప్పుడు
వందనములుబ్రోవులక్ష్మి వరవనమాలీ ॥ 103

కం॥ నేరిచి నేరక నేనును
కోరికహరి నీదుకృపను కొదవయులేకన్
మీరొసగిన శతకంబుల
సారసముగ జెప్పినాడ సరి వనమాలీ ॥ 104

కం॥ సరియనుచు నెవరుశతకము
మరివ్రాసియు చదివివినెదు మనుజులకవనిన్

సిరినాయువు వరతనయులు
జిరసౌఖ్యము లొసిగి బ్రోవు శ్రీవనమాలీ ॥ 105

కం॥ ఎందాకను రవిచంద్రులు
యందాకను భువియుదివియు యనయగతారల్
ఎందాకనుసురులుందురొ
నందాకను శతకమెలయు హరివనమాలీ ॥ 106

కం॥ వరకరిణీక కులంబున సరిమహాంజి
మహర్షి గోత్ర సంజీవునిచే
విరచుతమా లీశతకము
స్థిరమొందగ బల్కితౌర శ్రీవనమాలీ ॥ 107

కం॥ నూటెనిమిది పద్యంబులు
సూటిగ పూదండలనుచు సుందరమూర్తీ
నీటుగ నీమెడవేసుక
ధాటిగనను బ్రోవుచక్రధరవనమాలీ ॥ 108

కం॥ శ్రీమంగళ శుభదాయక
శ్రీమంగళ మాదిదేవ శ్రితమందారా
శ్రీమంగళ కరుణానిధి
శ్రీమంగళమారనీకు శ్రీవనమాలీ ॥

వనమాలి శతకము సంపూర్ణం.

